# ఓం శ్రీ
# మహాగణాధిపతయేనమః

శ్రీ మహాగణపతి జ్యోతిషాలయం, సాయి నగర్, నాగోల్, హైదరాబాద్



09849983322

# ద్వితీయాదిపతి వివిధ భావాలలో

## ద్వితీయము నుండి (2వ ఇంటి నుండి)

## 12 వ (పన్నెండవ) ఇంటి వరకు

Dr. Nageswara Rao Jayanthi
09949983322

# జాతక పరిసీలనకు గుర్తుంచుకోవలసిన విషయములు

- మనము చర్చించే అన్ని అధ్యాయములలో 1 వ ఇంటి నుండి 12 వ ఇంటి వరకు ఏ అధ్యాయము అయినప్పటికీ ఆ ఇల్లు ఆ అధ్యాయమునకు మొదటి ఇల్లు అవుతుంది దాని వెనుకటి ఇల్లు 12 వ ఇల్లు అవుతుంది.
- జాతకునికి రావలసిన ఫలితములు నిర్ధారించేది గ్రహముల స్థితి గతులే నిర్ధారించనని గుర్ర్తుంచుకోవలెను.
- అన్ని గ్రహములు సమముగా మంచివి చెడువికూడా .
- గ్రహము వున్నది సొంత యింటిలోనా లేక అద్దె యింటిలోనా పరిశీలించాలి. అద్దె యింటి లో అయితే స్నేహితుని, శత్రు, సముని ఇల్లా పరిశీలించాలి. గ్రహములు పై స్థితిని అనుసరించి ఫలితాలు ఇస్తారు.
- గ్రహము వున్న ఇల్లు ఆ గ్రహానికి శుభ స్థితి అయితే శుభ ఫలితాలను లేదా అశుభ ఫలితాలను యిస్తాయి.
- ఒకే రాసిలో ఎక్కువ గ్రహములున్నచో అవి ఆయింటి ద్వారా యివ్వవలసిన ఫలితాలను తారుమారు చేస్తాయి అని నానుడి.

ఇప్పుడు మనము రెండవ ఇంటిలో ఉన్నాము ఈ అధ్యాయము 2 వ ఇల్లు మొదటి ఇల్లుగా పరిగణించాలి 12 వ ఇల్లు లగ్నం అవుతుంది.

2 వ ఇల్లు - 1 వ ఇల్లు
3 వ ఇల్లు - 2 వ ఇల్లు
4 వ ఇల్లు - 3 వ ఇల్లు
5 వ ఇల్లు - 4 వ ఇల్లు
6 వ ఇల్లు - 5 వ ఇల్లు
7 వ ఇల్లు - 6 వ ఇల్లు
8 వ ఇల్లు - 7 వ ఇల్లు
9 వ ఇల్లు - 8 వ ఇల్లు
10 వ ఇల్లు - 9 వ ఇల్లు
11 వ ఇల్లు - 10 వ ఇల్లు
12 వ ఇల్లు - 11 వ ఇల్లు
లగ్నము - ఈ విభాగానికి 1 వ ఇల్లు

# 2 వ ఇల్లు - కారకత్వములు

- ధనము
- ఆర్థిక సంపద
- ప్రాపంచిక సంపద
- అదృష్టము – స్మృతి
- పరిశీలనా సక్తి
- వాక్కు
- దృష్టి
- కుడికన్ను
- భావనా శక్తి
- లాభనష్టములు
- సుఖ దుఖములు
- అప్పు నొసగుట
- బ్యాంకు బ్యాలెన్స్
- కుటుంబము
- ముఖము
- భోజనము
- వ్యాపారము
- మరణ స్వభావము

# 2 వ ఇంటి అధిపతి 1 వ ఇంట్లో

- 2 వ అధిపతి లగ్నములో వుంటే, లగ్నము కనుక బలముగా వుంటే జాతకుని తన సొంత కష్టము తోను మరియు తెలివితేటలతో సంపాదించుకుంటారు
- ఈ జాతకులు సత్ప్రవర్తన మరియు మంచి సంస్కార వంతులు.
- మాట్లడతములో తగు నేర్పరి మాటల నిఘంటువు కూడా కావచ్చు కనుక వీరి సంపాదన ప్రవచనముల ద్వారా ఉండవచ్చు.
- 2 వ ఇంటి అధిపతి మారక కారకుడు అయినందున లగ్నములో ఉన్నందున జాతకునికి ఆరోగ్య ఇబ్బందులున్డవచ్చు.
- లగ్నము 2 వ ఇంటి నుండి 12 వ ఇల్లు అయినందున ఈ జాతకులు సంపాదన కొరకు ఇంటి నుండి దూరముగా ఉండవచ్చు.
- కను దృష్టి ఇబ్బందులు ఉండవచ్చు.
- 2 వ ఇంటి అధిపతి 9 వ అధిపతితో కలసి వుంటే పిత్రార్జిత ఆస్తులు పొందుతారు.
- ఈ స్థితి ఒకటి కన్నా ఎక్కువ వివాహములకు దారితీస్తుంది.

# 2 వ ఇంటి అధిపతి 2 వ ఇంట్లో

- 2 వ ఇంటి అధిపతి రెండవ ఇంటిలూ వున్నప్పుడు, ఈ ఇంటిని ఈ అధ్యాయానికి మొదటి ఇల్లుగా తీసుకుంటాము కనుక మొదటి ఇంటి ఫలితలేవైతో వున్నాయో ఆర్ధిక స్థితి మరియు సంపద సముపార్జన కష్టార్జితములు.
- ఈ జాతకులకు 2 వ ఇంటి కారకత్వమైన వాక్సిద్ధి గ్రహ స్థితిని / గ్రహముల కలయికను బట్టి కలుగుతుంది.
- ఈ జాతకులు మంచి ఆకర్షణీయమైనశరీర దృఢత్వము , ముఖము మృదువైన మాట కలిగి వుంటారు.
- ఈ జాతకులు ఆహార ప్రియులై వుంటారు.
- ఈ జాతకులకు చిన్న తనములోనే విద్యాభ్యాసము, మంచి నడవడిక మరియు సంకృతి కలిగి వుంటారు.
- 2 వ ఇంటి అధిపతి సొంత ఇంటిలో ఉన్నందున ఈ జాతకునికి దీర్ఘ జీవిత కాలమును ప్రసాదించవలసిన గ్రహములు సరియైన స్థితిలో ఉన్నట్లయితే, మారక సంబంధమైన బాధలనుండి విముక్తి కలగే అవకాశములు మెండుగా ఉండును.

# 2 వ ఇంటి అధిపతి 3 వ ఇంట్లో

- 2 వ ఇంటి అధిపతి 3వ ఇంటిలో వున్నప్పుడు  భావాత్ భావముగా పరిగణించబడుతుంది, గ్రహముల స్ధనములు కనుక మంచి స్ధితిని కలిగి వుంటే ఈ జాతకుని ఈ స్ధితి మంచి చేయును.
- 3 వ భావము తన కన్నా చిన్న సోదరులను సూచిస్తుంది, కనుక వీరు సంపాదన వారి వలన మరియు తన కష్టర్జితము వల్ల ఉండును.
- ఈ గ్రహ స్ధితికి శుక్రుడు తోడయినచో  ఈ జాతకులు మంచి ప్రముఖ సంగీత కలాకారుడవుతారు అని చెప్పటంలో సందేహము లేదు.
- ఈ రాశిలో వున్న గ్రహముల ఆధారముగాను,  2 వ ఇంటి అధిపతి 3 లో వున్నందున ప్రాణహాని, అర్రోగ్య ఇబ్బందులు ఎదుర్కొనే అవకాశములుండును.
- ఈ రాశిలో చెడు గ్రహములున్నచో  3వ ఇంటిలో చెడు గ్రహములకు మంచి స్ధానమైనందున ఈ జాతకులు మంచి ధైర్య సాహసములు, సముపార్జకులు అవుతారు.
- ఈ స్ధితి జాతకునికి దగ్గర ప్రయాణములు ఎక్కువగా ఇచ్చును.

# 2 వ ఇంటి అధిపతి 4 వ ఇంట్లో

- 2 వ ఇంటి అధిపతి 3 వ ఇంటిలో ఉన్నందున, గ్రహములు సరియైన స్థితిలో వవున్నచో ఈ జాతకునికి మంచి సంపద, భూములు, వాహనములు, ఆనందం మరియు సౌకర్యములు పొందుతారు.
- ఈ జాతకులు మంచి వాక్చాతుర్యము కలవారాగుదు.
- నాల్గవ ఇల్లు తల్లిని స్సూచిస్తుంది. తల్లి భాగ్య వంతురాలు అయి వుంటుంది . తిల్లి ద్వారా వీరికి ధనము , ఆస్తులు సంక్రమిస్తాయి.
- 2 వ ఇల్లు మారక స్థానము చెడు గ్రహములు ఈ ఇంటిలో ఉన్నచో తల్లికి చెడు ఫలితములుంటాయి.
- ఈ జాతకుని భార్య ను ఈ స్థానము సూచించినందున ఆమె వృత్తిలో మంచి సంపాదన పరురాలు అయి వుంటుంది.
- 2 వ ఇల్లు , 4 వ ఇల్లు ఒక విధముగా విద్యనూ సూచించినందున వీరికి గొప్ప విద్యావంతులగుడురు.
- కుజుడు ఈ జాతకులకు మంచి స్థనమును కలిగి యున్నచో వీరు భూమి సంబంధ వ్యవహారములలో (క్రయ విక్రయముల) ద్వారా ఉండును.
- 4 వ ఇల్లు కుటుంబమును కూడా సుఉచిస్తుంది, కనుక వీరు ఉన్నత మైన ధనవంతుల కుటుంబలో జన్మిస్తారు. కుటుంబము పై అమిత ప్రేమాభిమానములు కలిగి వీరితోనే జీవిస్తారు.

# 2 వ ఇంటి అధిపతి 5 వ ఇంట్లో

- ఈ జాతకునికి గ్రహముల స్థితి బాగున్నట్లయితే, వీరు పూర్వ జన్మ సుకృతము వలన సంపద సముపార్జన వుంటుంది. 2 వ ఇంటి అధిపతి 5 వ ఇంటిలో ఉన్నందున ఈ గ్రహము 11 వ ఇంటిపై దృష్టి వున్నందున మంచి సంపాదన వుంటుందని ఖచ్చితముగా చెప్పవచ్చును.
- ఈ ఇల్లు జాతకుని సంతానమునకు సంబంధించినది కనుక ఈ జాతకులు సంపాదన సంతానము వలన గాని లేదా సంతానము యొక్క సంపాదన లో వీరి పాత్ర ఉండును.
- వీరు అందమైన ముఖము మరియు వాక్ చాతుర్యము కలిగి వుంటారు, వీరి సంపాదన కూడా దీనిపైనే వుండవచ్చు.
- ఈ ఇల్లు (5 వ) స్పెకులతిఒన్ మరియు ఆకస్మిక ధన లాభము అయినందున వీరికి ఈ రకమైన ఆర్థిక లాభములు వుండవచ్చునని చెప్పవచ్చును.
- ఈ జాతకులు తన వాక్చాతుర్యము ద్వారా విపరీత మైన ప్రజా సంబంధములు కలిగి వుంటారు.

# 2 వ ఇంటి అధిపతి 6 వ ఇంట్లో

- 6 వ ఇల్లు దుస్తానముగా చెప్పబడినది.ఈ జాతకులు అక్రమ, అవినీతి మార్గముల ద్వార సంపాదన వుంటుంది.
- కుటుంబము లేక ఇతరుల నుండి వివాదముల లేదా అక్రమ ఆస్తులు సంపదను పొందు అవకసముండును.
- వీరి వాక్చాతుర్యముతో సమస్యల పరిష్కరములలో మధ్యవర్తిగా వ్యవరిస్తారు.
- ఆస్తుల సంబంధిత విషయములలో శత్రువులు పెరిగే అవకాసము మెండుగానుండును.
- 6 వ ఇల్లు రోగ, ఋణ, శత్రు కరకములైనందున, 2 వ ఇల్లు సంపాదన కు చెందినదైనందున వీరు ఖర్చు ఎక్కువ వైద్యసలలకు మరియు వ్యాధి నిరోధకతకు వుంటుంది.
- ఈ జాతకులు ఋణములు ఇచ్చి దానిపై సంపాదన లేదా వీరు రునగ్రస్తులై వాటిని తీర్చుకోవడము జరుగుతుంది.
- 2 వ ఇల్లు అధిపతి మారకుడు, అలాగే 5 సంతాన విషయము కనుక , వీరి సంతానమునకు అరోగ్య లేదా ఇతరత్రా ఇబ్బందులు వుండే అవకాశముంటుంది.

# 2 వ ఇంటి అధిపతి 7 వ ఇంట్లో

- 2 వ ఇంటి అధిపతి 7 వ ఇల్లు లో ఉండుట వలన (7 వ ఇల్లు జీవిత భాగస్వామి అయినందున) వీరికి జీవిత భాగస్వామి ద్వారా వివిధ రకాలుగా ఆస్తులు, లేదా వృత్తి సంబంధమైన సంపాదన సమకూరుతాయి.
- 7 వ ఇల్లు జీవిత భాగస్వామికి లగ్నము అవుతుంది కనుక అక్కడ నుండి 2 వ ఇల్లు 8 వ ఇల్లు అవుతుంది, కాన జీవిత భాగస్వామికి ఆరోగ్య రీత్యా మంచిది కాదు.
- 7 వ ఇల్లు ఆనందానికి / ఆహ్లాదానికి సంబంధించినందున వీరు శీ సాంగత్యానికి ఎక్కువగా ఖర్చుపెడతారు. ఇరువురు కూడా నీటి కలిగ వుండక పోవుట వలన ఇది రెండవ వివాహమునకు దారితీయవచ్చు.
- ఈ జాతకులు విదేశీ స్త్రీతో వివాహము అయ్యే అవకాశముండును.
- 2 వ ఇల్లు కుటుంబము 7 వ ఇంటిలో ఉన్నందున , ఈ జాతకులు వివాహము కుటుంబములోని వ్యక్తులతో గాని లేదా కుటుంబములోని వారితో అక్రమ సంబంధము కలిగి ఉండును.
- 2 వ ఇల్లు సామాజిక స్థితిని తెలుగుపును, వీరు సమజములో ప్రసిద్ధి కలవారు మంచి గౌరవ మర్యాదలు కలిగి వుంటారు.
- 7 వ ఇల్లు ప్రయాణాలను సూచిస్తుంది, కానుక సంపాదన ప్రయనములకు సంబంధినదై వుంటుంది.

# 2 వ ఇంటి అధిపతి 8 వ ఇంట్లో

- 8 వ ఇల్లు కుడా ధుస్థానము మరియు సులభ లాభాములను తెలుపును, 2 వ ఇంటి అధిపతి ఇక్కడ వుండుట వలన  వంశపారంపర, లాటరీ, జూదము వంటి వాటిలో ఉండును.
- 8 వ ఇల్లు ప్రమాదములు ఆకస్మిక విషములు, ఆయుర్ధాయము. అందువలన వీటికి సంబంధిన ఖర్చులు మెండుగా వుండును.
- ఈ విధమైన గ్రహ స్థితి (2 వ ఇంటి అధిపతి 8 ) ఇది8 వ ఇంటినుండి  7 వ ఇల్లు కుడా అయినందున వీరి వైవాహిక జీవితములో ఇబ్బందులు గాని విడాకులు గాని వుండవచ్చు.
- 8 వ ఇల్లు ఇబ్బందులు, అవమానములు, నిరాశ నిస్పృహలు తో కూడినది. కనుక ఆ కుటుంబములో వీటి కారణముగా అసంతృప్తి ఏర్పడుతుంది.
- ఈ జాతకులు ఆహార విషయక సమస్యలు అనగా తిండి వషయములో ఇబ్బందుల ఎదుర్కొంటారు.
- ఈ జాతకులకు మాట సంబంధిత లేదా కంటి / కంటి చూపు సంబంధిత ఇబ్బందులుంటాయి.

Dr. Nageswara Rao Jayanthi
09849983322

# 2 వ ఇంటి అధిపతి 9 వ ఇంట్లో

- 2 వ ఇంటి అదితి 9 లో వుండుట శుభ పరిణామము ఎందుకనగా ఈ ఇల్లు భాగ్యమును  సూచిస్తుంది.
- ఈ ఇల్లు పితృ కారకత్వమైనందున ఈ జాతకుని తండ్రి ద్వార సంపదను గాని వీరి సంపాదనకు తండ్రి సహాయ సహకారములు గాని వుండును.
- ఈ జాతకుని తండ్రికి అ్రోగ్య సమస్యలు వుండే అవకాశముంటుంది, ఈ జాతకులు తండ్రితో మంచి అన్యోన్యత , ఆప్యాయత కలిగి వుంటారు.
- 9 వ ఇల్లు మతసంబంధిత మైనందున  వారి సంపదను మత సంబధిత క్ర్యక్రమములలో పెట్టుబడి  పెడతారు.
- 9 వ ఇల్లు విదేశీ ప్రయనములు, కాన, కుటుంబ సంపాదన నిమిత్తమై వీరు విదేశాలలో స్థిరపదతారు.
- 9 వ ఇల్లు ఉన్నత విద్య, అందువలన వీరి వున్నత విద్య విదేశాలలో ఉండును
- ఈ జాతకులు అధ్యాత్మిక  విషయములలో సాధన వుంటుంది.
- 9 వ ఇల్లు 2 వ ఇంటినుండి 8 వ ఇల్లు అయినందున వైవాహిక  జీవిత కొనసాగింపునకు మంచిది కాదు.  ఇది జీవిత భాగస్వామి ఆకస్మిక మరణానికి దారితీయవచ్చును ( ఇది చెడుగ్రహముల ప్రభావమున్నచో.)

# 2 వ ఇంటి అధిపతి 10 వ ఇంట్లో

- 2 వ ఇంటి అధిపది 10 వ ఇంటిలో ఉండటము శుభ సూచికముగా చెప్పవచ్చును. గ్రహముల స్థితిని పరిగణన లోనికి తీసుకోనవలయును.
- ఈ జాతకులు అతి పిన్న వయసులోనే సంపాదన పరులవుదురు. వీరి స్వయం కృషి, తెలివితేటలు మరియు వాక్చాతుర్యము ల వలన వీరు అభిద్ధి చెందుతారు.
- ఈ జాతకులు వృత్తిలో రాణిస్తారు, అలాగే వారు స్వంత వ్యపరమును ప్రారంభించి అభివృద్ధిని సాధిస్తారు. వీరిఆర్థిక సముపార్జన ప్రభుత్వము నుండి కూడా పొందటానికి అవకాశములు మెండుగా వున్నాయి.
- ఈ జాతకులు స్నేహితాలలో, కుటుంబములో మరియు సమాజములో పేరు గాంచిన వారి వుంటారు.
- 2 వ ఇంటి అధిపతి వ్రాకిన్చినాను లేదా అధిపతి కలసిన గ్రహముల వలనను వీరి తండ్రికి ఆరోగ్య సమస్యలు తలయెత్తే అవకసముండును.

# 2 వ ఇంటి అధిపతి 11 వ ఇంట్లో

- సంపదలకు కారకుడైన 2 వ ఇంటి అధిపతి లభస్థానమైన 11 వ ఇంటిలో ఉన్నందున అమిత ధనవంతులు అవుతారు. ఈ స్థితిని ధనయోగమని కూడా అంటారు.
- వీరు ధన సంబంధిత వ్యవహారములలో క్రియాశీలకముగా వ్యవహరిస్తారు. అలగే వీరి సంపాదన అన్నలు / అక్కలు మరియు స్నేహహితుల ద్వారా వీరి కోరికలు తీరుతాయి కారణం 11 వ ఇల్లు పై కరక్త్వములయినందున.
- 2 వ ఇల్లు 11 వ ఇంటినుండి 4 వ ఇల్లు అయినందున వీరు కుటుంబములో గృహ విషయములోను ఆనందతిసయములు కలిగిన వారవుతారు.

# 2 వ ఇంటి అధిపతి 12 వ ఇంట్లో

- ఈ జాతకులు అత్యధికము సంపాదన కలిగినవారవుతారు. వీరి సంపాదన వైద్యశాలల నుండి వచ్చే అవకసముకలడు. 2 వ ఇల్లు ఆదాయము 12 వ ఇల్లు వైద్యశాలలు. అలాగే వీరి ఖర్చు కూడా వైద్య సంబందితమైనది.
- 12 వ స్వ సుఖమును తెలియజేయును , కాన, ఈ జాతకులు స్వ సుఖమునకు ధనమును ఖర్చు చేస్తారని చెప్పవచ్చు.
- 12 వ ఇల్లు మోట పరమైన లేదా ఆధ్యాత్మిక సంబంధిత కార్యక్రమములకు ఖర్చు చేస్తారు.
- 12 వ ఇల్లు సుదూర ప్రాంతములను సూచిస్తుంది కనుక, ఈ జాతకులు సంపాదనకు సుదూర ప్రాంతాలకు / విదేశాలలో వుంటుంది.
- 12 వ ఇల్లు అనైతిక / అన్యాయ పరమైనది కావున వీరి సంపాదన ఈ రకముగా వుండే అవకాశములు ఎక్కువ.
- 2 వ ఇల్లు మారక స్థానము, 12 వ ఇల్లులో ఉన్నందున వీరికి దీర్ఘకాలిక రోగముల వలన తక్కువ జీవిత కాలమును సూచిస్తుంది.

# ఈ సమాచారము సమకూర్చిన వారు

**శ్రీ మహాగణపతి జ్యోతిషాలయము**

**డా. నాగేశ్వర రావు జయంతి**
**జ్యోతిష శిఖామణి**

జ్యోతిష శిరోమణి (కృష్ణమూర్తి పద్ధతి)
ఎం.ఏ జ్యోతిష్యము, పి.హెచ్.డి – జ్యోతిష్యము
ప్లా.నం. 3/3, 2-3-364/7, రోడ్డు నెం. 7,
సాయినగర్ కాలని, నాగోల్,
రంగారెడ్డి జిల్లా , హైదరాబాద్ - 500068
మొబైల్ : **9849983322**

